ఓం.

శ్రీరస్తు.

శ్రీ రా మా

# రామశతకము

ఆగూరు సింహాచలం పట్నాయకులుగారిచే
రచియింపఁబడినది.



చెన్నపురి:

శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.

వెల 0—1—6.

సీ. శ్రీలక్ష్మీనాథుని శ్రీపాదములుగొల్చి
హర్షించునట్టి ప్రహ్లాదుఁ డనఁగ
శీతమయూఖ సంప్రీతకువలయుఁడై
యశమున విలసిల్లు శశి యనంగ
జనకునియాజ్ఞను జవదాటకుండను
రమణ వెంపొందు శ్రీరాముఁ డనఁగ
దానధారాతుష్ట ధారుణీసురుఁడౌచు
నెటి విలసిల్లు కానీనుఁ డనఁగ

తే. విష్ణు సేవించి కీర్తితో వెలసి జనకు
నాజ్ఞఁ దలఁదాల్చి దానము లాచరించి
శ్రీముకుంద మహాంతినాఁ జెలఁగుచున్న
మత్పితృవ్య సుతుని శౌరి మనుచుఁగాత.

శ్రీ రా మా.

# పీ ఠి క.

ఆప్తులారా!

నేనీ రామశతక మెనిమిదేండ్లక్రిందటనే రచించితిని కాని నే నప్పటికి పదునైదేండ్లబాలుఁ డనగుటచే నెక్కుడు దోషములుండునని తలఁచియే పదినాల్గుపద్యములను లిఖించి విడిచితిని. నామిత్రులగు మహారాజశ్రీ పూసర్ల సత్యనారాయణగారును, పోలాపు అప్పలస్వామి నాయుడుగారును, బాల్యమిత్రుఁడగు పోడసింగి కామినాయుఁడుగారును మఱల ప్రోత్సహించుటచే రామనామ మెత్తినను నూఱుసారులు బలుకు మహాభాగ్యము లభించుట తప్పదుగదా! యని నా పదునేడవయేటను పూర్తిచేసితిని. కాని గురువుల నాశ్రయింపకపోవుటచే తప్పిదములు మిక్కుటముగా నుండుననుసంశయము విడువలేను. పండితులగుమీరు నామీఁద దయఁబూని తప్పులను దెలియఁజేసినయెడల రెండవముద్రణమందు సవరించుకొందును.

లోకాస్సమస్తా స్సుఖినో భవంతు!

ఆగూరు కంచరాం.
2—8—35.

భక్తజనవిధేయుఁడు,
ఆగూరు సింహాచలం పట్నాయకులు.

ఓం.

శ్రీ ర స్తు.

## శ్రీ రా మా

# రామ శతకము

క. శ్రీకర! ప్రతాప విజితవి
భాకర! సుగుణాకరసురవైరి! మహద్ద
ర్వీకర! సూర్యాన్వయ ర
త్నాకర హిమకరకరిచరహా! శ్రీరామా. 1

క. రంగా! ఋషి సంగీర్ణఘు
నాంగా! సీతా సతీహృదబ్జపతంగా
చంగా! రిపుజనపవన భు
జంగా! పవనసుత చిత్తసంగా! రామా. 2

క. వృక్షచర పక్ష! దనుజ వి
పక్ష శుభకటాక్షవీక్ష! పండితజనసం
రక్షపణాయిత దక్ష! బ
లక్షితిపాధ్యక్ష! సాధు లక్షణ రామా. 3

క. శీల! కరుణాలవాల ర
మాలలనాహృదనుకూల! మానవపతిశా
ర్దూల! సువర్ణ మయూంచిత
చేల! సకలలోకపాల చిరయశ రామా. 4

క. ఏమహిత చరితమానస
భూమిసముద్భవసు పద్యముఖ్యాగ్రమణుల్
ధీమచ్ఛ్రితి రవణంబులఁ
గామను నాకవులఁ గొల్తు ఘనులని రామా. 5

క. ఎన్నికఁగాంచిన కవిగ్యై
చెన్నుగ మాపురంబుననె వసించుసుభక్తుఁ
గొన్నా బత్తుల సాంబుని
వెన్నెల లిడుచుందు నెపుడు పృథివిని రామా. 6

క. పలుకు పొలంతినిఁ గని స
త్కులుఁడై ప్రభవించి సుకవికుంజరుఁడై భూ
స్థలి నెలసిన ముత్తాతను
బలగ జగన్నాథుఁగొల్తు బాగుగ రామా. 7

క. పొంగుచు నేవేళబలగ
రంగయకవిఁ దలఁచుచు మఱిరహిఁగొల్తుఁ స
త్సంగునిఁ గొమ్మన తాతయ
పుంగవు మాపురమున కవిపోషణ రామా. 8

క. అనయముఁ బరధనముల మన
మునఁ దలపక వెలసిన కవిపుంగవుఁడౌ నా
జనకుని నీలాద్రిని మన
మున భావింతునెలమి మునిపూజిత రామా. 9

క. లోకజనకా! కృపాళూ!
రాకా చంద్రమయశోవిరాజా! శౌరి
ప్రాకట గుణాకరా! దే
వా! కవివినుతా భువన భవన రఘురామా. 10

క. ఇమ్మా! వరములు వేఁడెదఁ
గొమ్మా! నేనిడు ఫలములు గూరిమితోడన్
రమ్మా! యిఁకనైనను గో
పమ్మా! ననుగావనీకు పావన రామా. 11

క. వామా! వందిత సుకవి
స్తోమా! ముఖవిజితపూర్ణసోమా! సుగుణో
ద్దామా! భండన నిర్జిత
భీమా! సురరిపుమనోవిభీషక రామా. 12

క. వినుమా! మనవిని మ్రొక్కులు
గొనుమా! యిడుచుంటినేఁడు గోరికతోడన్
నినుమానకఁ గాచెదనిఁక
ననుమానమ్ముడుగు మనుచు ననుమా రామా. 13

క. తరణమ్ములు భవజలధికి
హరణమ్ములు ధరణిఘోరహత్యల కెల్లన్
కరణమ్ములు కవులకు నీ
చరణమ్ముల సేవదెలియసద్గురు రామా. 14

క. కారణమై మోక్షమునకు
వారణమై ఘోరపాప వనజతతికి స
ద్ధారణమై భవనీరధి
తారణమై యొప్పుత్వదభిధానము రామా. 15

క. భువనంబుల నీసుకథా
కవనంబులఁ జేయునట్టి కవిచంద్రులకున్
రవణంబు లెలమి నొసఁగుచు
భువనోన్నత పదవినిచ్చి బ్రోతువు రామా. 61

క. అందమ్ములు హాపలను మక
రందమ్ములు వినిన యట్టి లాటులకు మహా
నందమ్ములు బృందారక
బృందములకు నీచరితము పృథుగుణ రామా. 17

క. దనుజులఁ జంపుచు ధరలోఁ
బనివడి మునివరులఁగాచి బఱఁగిన నిన్నున్
మనమున నెంచెడు ధీరుల
ననయము చేకొంతునయ్య హరినుత రామా 18

క. నమ్మను దేహము నాదని
నమ్మను సంసారము మఱినాయుల వలపుల్
నమ్మను భోగ్య ప్రతతుల
నమ్మను సద్దైవములను నమ్ముదు రామా. 19

క. కనుచున్నవి భూతంబులు
చనుచున్నవి యేండ్లు ధరణి సత్వరగతితో
కనుచున్నను చనుచున్నను
గనకైతిని కావరమున కవినుత రామా. 20

క. ఎప్పుడు వోవునో దేహము
నిప్పుడ నిను వేఁడుచుంటి నిరతుల విపా
తప్పక నన్నిలఁ గావుము
నొప్పుగ నిను వేఁడుచుండు సురబల రామా. 21

క. ఎక్కడ గూలునో దేహము
నిక్కముగాఁ జెప్పుచుంటి నిఖిలాధారా!
మ్రొక్కెద నినునే నిప్పుడు
మక్కువ ననుఁగావరమ్ము మానక రామా 22

క. ఇందిందిరములు కిరముల
సందడితో మధువుఁ గ్రోలఁజాలిన కరణిన్
సందడి నీపద వనజమ
రందముఁ గ్రోలెద విసువక రాఘవ రామా. 23

క. పదునైదవయేటను నీ
పదములు గొలువఁగ గడఁగితి బాలుఁడనగు నా
యెద నిలుచుచు నన్నెప్పుడు
ముదమిడుమిదె గొల్తునిన్ను మునిసుత రామా. 24

క. జనకుఁడు పనుపఁగ మునివెను
కను తమ్ముఁడు వెనుకొనఁ జనిగాధేయుఁడు నె
మ్మనమున నెనరొందఁగ సుం
దుని భార్యను జంపినావు తొలుతను రామా. 25

క. మారీచుని నొక చిల్కునఁ
బారావారమ్మునఁ బడవైచి సుబాహున్
వేఱొక నారాచంబున
మారణ మొనగూర్చినావు మాయురె రామా. 26

క. రాతిని నాతిగఁ జేయుట
భూతేశుని ధనువువిఱిచి పుణ్యాంగనయౌ
సీతను బెండ్లాడుట బల్
ఖ్యాతిని జెందితివి ధాత్రి హరిపని రామా. 27

క. జనకసుతావరజులతో
జనకుఁడు పనుపఁగ నడవికిఁ జనుచున్మార్గం
బున భక్తుఁడగు గుహునిగా
చిన నిను వర్ణింపవశమె శ్రీరఘురామా. 28

క. నినుఁగొలుచు శబరియెంగిలి
గొనుట దెలియభక్తుఁ డెట్టి కులసంభవుఁడై
నను బ్రేమింతువనుట కది
ఘనసాక్ష్యము గాదటయ్య కవినుత రామా. 29

క. వడుగఁడు గాడుపు కొడుకే
యొడయుని హజ్జల మదినిడి హార్మత్తుదుటున్
గడియించె నట్టినీజగ
గడిదుగినఁడుఁ బొగడలేఁడు ఘనగుణ రామా. 30

క. వాలినొక కోలఁగూలిచి
మేలిడవే రవి సుతునకు మేల్మేలనుచున్
వేలుపు లగ్గింపఁగ నీ
మేలిమిఁ దెలుపంగవశమ మేదిని రామా. 31

క. పగవాఁడని మదిఁదలపకఁ
దగఁబడి తలలవాని తమ్మునకున్ నీ
తెగనునిచి మనుచు నిన్నె
న్నఁగఁదరమా యేరికైన నరసఖ రామా. 32

క. యదుకులవీరా యని ద్రౌ
పదివేడఁగ వల్వలిచ్చి భామామణికిన్
ముదమిడు నీనామము నా
మదినిల్పుదుఁ గావుమయ్య మానక రామా. 33

క. చిలుకకు నీదగు పేరిడి
పిలిచిన చిలుకలకొలికిని పేర్మిస్మృతికిన్
నెలకొలుపు కృపాళూ! నినుఁ
గొలిచిన కొదవేమికలదు గుణగణ రామా. 34

క. సతులును సుతులును గతులని
మతిమంతులు దలప కెపుడు మానుగ భువిలో
నతులంబగు నీయంజలె
గతులంచును దలఁతురయ్య కవినుత రామా. 35

క. భువి ఋషి యొకఁడు "స్వదేశో
భువనత్రయ" మనుచును ముదమునఁ దెలుపండే
కవు లీమాటను దెలియుట
భవదీయహృదయ మెఱుఁగుట పావన రామా. 36

క. ఇలనొకదానిన సద్వి
పృలు బహుధా నుడువుదురనుపుడు కేవేళన్
దలఁచుచు నీపైచిత్త
నిలిపిన సుగుణోత్తముండు నేర్వరి రామా. 37

క. కమలోదర "సత్యంజ్ఞా
న మనంతం బ్రహ్మ"యను ఘనశ్రుతి నాయు
ల్లమున మఱువకుండఁగఁ జే
యుము పదివేలనుచుఁ దలఁతు నుర్విని రామా. 38

క. భావమున "బ్రహ్మవిద్బ్ర
హ్మైవభవతి" యను శ్రుతినుడు వెంతో ప్రీతిన్
కోవిదులు దలంచుచునీ
సేవ న్విడనాడలేరు సిద్ధము రామా. 39

క. విదితనిగమపథ "సత్యం
వద ధర్మంచర" యను శ్రుతి వాక్యద్వయమున్
మదిఁ దలఁచుచు తత్పరణిన్
వదలఁడు సుగుణోత్తముండు వాసిగ రామా. 40

క. గోరామాధీశోద్భవ
కారణవనజోదరసురగణనుతనామా
మేపకు ధరధీర యశః
పూరిత రోదోంతరాళ మురహర రామా. 41

క. నిటలాక్షాది సురనికర
నిటలతట ఘటిత శుభకర నీరజకులిశ
స్ఫుటరేఖాంకిత భవదు
త్కట శుచి చరణములుగొల్తు కవినుత రామా. 42

క. ధరణీసుత హృదయ సరో
వర కుచకమల మదనరత వరటాపతి నీ
చరణారవింద సేవా
పరతంత్రుఁడె పరమపదవిఁ బడయును రామా. 43

క. నిను మనమునఁ దలపోయక
దినములు వెలిఁబుచ్చితి నని దీనావన నీ
మనమున ననుఁ గినియక వే
మనుపుము నిను వేఁడుచుంటి మఱువక రామా. 44

క. కరుణోపేతులు వరధ
ర్మరతులు సకలాగమార్థ మర్మైకవిదుల్
గురుసేవాలోలుప స
త్పురుషులు నీమెచ్చువారు మురహర రామా. 45

క. నీతత్వ మెఱుఁగువాఁడే
భూతలమున సిద్ధిఁజెందు పురుషుఁ డనఁదగుఁ
పూతాత్మక కొల లన్నను
బీతొందని యట్టివాఁడు పెంకొ రామా. 56

క. మణులందున సూత్రముఁ బలె
ప్రణయముతో జగతియందు భాసిల్లు నినుఁ
గుణవంతులైన మాబుషి
గణములు గనుఁగొనిరి కారె ఘనతన్రామా. 47

క. భారతదేశీయులు మత
వైరంబులు సెంచకున్న వర్తిల్లుటకై
గూరిమితో నీపదపం
కేరుహములు దలఁచుటెల్ల కేశవరామా. 48

క. ధారుణి పరోపకారము
వారక నొనరించునట్టివారె మహాత్ముల్
కారుణికోత్తమ తత్సే
వారతి నాకొసఁగుమయ్య వారము రామా. 49

క. నీకేసుగుణములు కలవా
నాకా సుగుణంబులిచ్చి నను నీవారిఁ
ప్రాకటముగఁ జేర్చుటకై
నీకిడుదు జొహారులిపుడు నెమ్మినిరామా. 50

క. జగదంబా! నాతోడను
జగడంబా! బలుకకుంట సన్నుతమగు నీ
జగదంబే దలపఁగ నే
నిగిడింపవు నీదుదృష్టి నెమ్మిని రామా. 51

క. సుగుణా! నను విడ నీ
కదితగునా! నిన్నెపుడును మదిఁదలపంగా వీ
లగునా! డాగంగ మునీం
ద్రగణావన సురగణవినుతచరణ రామా. 52

క. జగతిని ననుఁగాచిన బల్
మగతనమని మదిఁదలఁచెద మఱువక వే నన్
జగతని వొందఁగఁ జేయుము
నగతనయాపతినుత వరనామా! రామా. 53

క. వనచరకూర్మ కిటినృహరి
ఘనవామన పరశురామ ఖరరిపుహల భృ
న్ముని కల్క్యవతారంబులు
మనమున ధ్యానింతు నెపుడు మానక రామా. 54

క. కొందఱు నిను సత్తందురు
కొంద ఱసత్తందురు మఱికొందఱు సదస
త్తందురు తండ్రీ! నాకా
నందం బెవ్వ రెటులనిన నరసఖ రామా. 55

క. జగమంతయు నొకతీరున
నెగడిన నష్టమని దలఁచి నీవెన్నో తీ
ర్లుగ నిలిపితివి మతంబులు
సుగుణోత్తముఁ డెఱుఁగుదీని సుగుణా రామా. 56

క. హరివంశంబునఁ బుట్టియు
హరికులులను గాచినట్టి హరినుత చరితా
హరిహరియని నినుఁబలికెద
వరమతితో రాఁగదయ్య వాసిగ రామా. 57

క. మలమునఁ గ్రిమివడు వడువున
నిలఁబడుదేహమ్ము దీని హేయంబనుచున్
దలఁచెడు ధీరునిఁగాతువు
విలసనమున నెపుడు ధరణి వే మన రామా. 58

క. హరి నారాయణ కేశవ
నరహరియనుచును సతతము నమ్రుండవుచున్
ధరణిని బలికెడు జనులను
కరుణను రక్షింతువయ్య కవినుత రామా. 59

క. సుందరమగు నీరూపము
సందడితోఁ జూపుమంటి సారసనేత్రా
మందుఁడ నని మదిఁదలఁపక
తొందరగా రాఁగదయ్య దొనరున రామా. 60

క. కుక్షిని ముజ్జగములనిడి
రక్షణసేయవె యెపుడును రమ్యముతోడన్
పక్షిగమన నను నీదయ
రక్షింపుము వేఁడుచుంటి రాఘవ రామా. 61

క. పతియే రూపము సాధ్వికి
యతికి స్వరూపంబు ధరణియమమే దెలియన్
నతరూపము నరునకు నీ
గతియే రూపమ్మునాకు కవినుత రామా. 62

క. పంకమునఁ జిక్కి మీనము
శంకించుచు జలముఁగోరు చందమునన్ నే
పంకపుఁజెయువులఁబడి నీ
వంకకుఁగను నను మనుపవె వాసిగ రామా. 63

క. శ్రీరామయన్న నామమె
తారకమని యండ్రు బుధులు ధారుణిలో నీ
తారకనామముఁ బలికిన
మారాడకఁ గాతువెపుడు మాధవరామా. 64

క. వేషలు పెద్దవె యిప్పటి
వారికి తక్కువగుణములు పరమేశ్వర యా
వేషలు నాకేలను నీ
సాసపుబత్తిషము చాలు సదయా! రామా. 65

క. కలిలో జనసంఘంబులు
కొలలే యొనరింత్రుగాని కొంచెంబైనన్
దలఁపరు పూర్వాచార్యుల
పలుకులు మతిహీనులౌచు పావన రామా. 66

క. మంత్రబలంబులు సమసెను
యంత్రబలంబులు వాసికెక్కెనయ్యయ్యో జీ
వింత్రెట్టులు సజ్జనులు స్వ
తంత్రంబులు గలిసెనీట దశరథ రామా. 67

క. పూర్వాచార్యుల మాటల
నర్వాచీనులు విడిచి యహంకారముతో
దుర్వారానృతపరులై
యుర్విని జెడిరితిలకింపుమో శ్రీరామా. 68

క. రవియెఱుఁగని చోట్లెల్లను
కవివరుఁడే యెఱుఁగునన్న ఘనమగు పలుకున్
జెవిఁబెట్టఁ డహో యిప్పటి
కవియనువాఁ డెవ్వఁడైనఁ గనుమో రామా. 69

క. అడిబండలు తోలునుడువుల
నుడువులు పెడచెవులను నిడి నుడువుదురెన్నో
చెడునుడువుల జడియక జము
డిడుగోడవలకు పుడమినిన దేలనో రామా. 70

క. రారా బువిపట్టి మగఁడ
రారా చిన్నినగువాఁడ రారాసామీ
రారా గుణములతిట్టా
రారా బత్మేలుకుప్ప రారా రామా. 71

క. మాతలి సీతమయ్యైనను
నీతో ననుఁ గావుమనుచు నిరతిని సెపదా
నాతండ్రీ కనికారము
నీతనయునిపై విడఁదగునే శ్రీరామా. 72

క. గొడ్డాండ్రు బిడ్డలఁ గనుట
గ్రుడ్డిజనులు సకముఁగనుగొంట పుడమిలో
నెడ్డెలు నీబత్తులతో
నొడ్డారించుట నిజమెటులో శ్రీరామా. 73

క. తొలుతటి వేళలలో నినుఁ
బలికిన సన్నాసులు తడబాట్లొందక నీ
నెలవున మేలొందరె నేఁ
బలికెద నిను నీగెడనిపు బాగుగ రామా. 74

క. మినుకుల ఫక్కీలిప్పటి
జనులకు నచ్చుకఁ గడునగచాట్లకు పాదౌ
పనులే సేతురు నీపద
వనజంబుల చింతవీడి వరగుణ రామా. 75

క. సొమ్ములఁ గొమ్మల విడునడి
నిమ్మళమున నొక్కచోట నీయడుగుం బొం
దమ్ముల డెందమ్ముననిడి
యిమ్మొందుట నెన్నఁడౌనొ యినకులరామా. 76

క. పొట్టోరెమె ముత్తగ్యోను
తిట్టె పెనుధర్మమయ్యె దేవేశ్వర నీ
మెట్టలు దలఁచుటె విస్మై
తట్టెను నేటి జనములకు దశరథరామా. 77

క. తంగేటిజున్ను కాదే
పొంగుచు నీయడుగుఁదమ్మి మొనసిగొలుచు స
త్సంగునకు మోక్షపదమో
గంగాపతి వంద్యమాన ఘనగుణ రామా. 78

క. పటపటగీటుచుఁ బండ్లను
తటమటఁ జేయునని జముఁడు తద్దయుగుండెల్
తటతటఁగొట్టుచు నుండెను
లొటలొట ననుఁగావఁదగు నలుగుడిగి రామా. 79

క. క్రమమున మహోపనిషద
ర్థములను నెల్లప్పుడు ఘనతందెలియుచు ని
న్నుమనమునఁ దలఁచు పురుషుఁడు
యమబాధలఁ జెందఁబోడు హరసఖరామా. 80

క. అన్ననుసై దోడును మఱి
నన్నును నీకాళ్లవైచి నాయన జన మా
చిన్నతనంబున నుండియు
మన్నేఁడ మముఁగాచినావు మహిలో రామా. 81

క. తనయులు తప్పులు సేసిన
జనకులు మన్నింపకుంద్రె సద్భావముల౯
తనయుఁడనగు నాతప్పులు
మనమున దలపోయకిపుడు మనుపుము రామా. 82

క. ననువంటివారి నెందఱ
మనిపితొ లెక్కిడతరంబె మధుసూదన నా
మనవిని విని నన్నట్లే
మనుపుము గిడిగిళ్లెడదను మహిలో రామా. 83

క. లూలామూలము లేకను
బాలక నినుఁగాచుచు మఱిపాపంబులు ని
ర్మూలింతును జడివిడుమని
యేలిక ననుబలుకుము భయమేటెద రామా. 84

క. నిను సకలాత్మునిగా మన
మునఁ దెలియుచు మఱపుఁజెంది పురుషుఁడదేమో
గినియుచునుండును పెక్కడ
లను కారణమా దెలియదు రాఘవరామా. 85

క. నీటను బిసపత్రముఁ బలె
పాటవమునఁ దిరుగుచుండు భక్తులనెపుడున్
సూటిగఁ బుట్టించుటకై
మాటికి నిను మ్రొక్కుచుంట మహిపారామా. 86

క. భారతభూమిని నెన్నో
మారులు జన్మించుచు రహి మాక్షేమములన్
నారయుచుండిన నీఋణ
మేరీతిని దీర్తుమయ్య యిలలో రామా. 87

క. ననకెన్ని పేళ్లు గల్గినఁ
గనుఁగొన గంధమొకరీతిగ వెలయునట్లే
నినుఁదెలియ నెంచువానికి
వనజోదర దీనలోకబంధూ రామా. 88

క. భారతజను లెద్దానిని
భూరిధనంబుగఁ దలంచి పోషించిరొయా
సారంబగు జ్ఞానధనము
కోరితి నాకిడఁగదయ్య గురువర రామా. 89

క. సమయమును నిరీక్షించుచు
మమురక్షింప నినువంటిమనుజుల మాదే
శమున జనింపఁగఁజేసిన
విమలాత్మా నిను మఱతుమె పృథివిని రామా. 90

క. పదితలలవాఁడు వైదే
హిఁ దనపురంబున నునిచిన నెమ్మెయి నీపై
ని దమిని నాయమ నునిచెనొ
ముదమున నాకాతమి నిడు మ్రొక్కెద రామా. 91

క. ఔరవివేకానందుని
భారతభూమిని సృజించి పరమ ప్రీతిన్
గూరిచి మాకీర్తినిలుపు
నారాజా నినుమఱతునె నయగుణ రామా. 92

క. ఎవ్వఁడు గజరాజవరదుఁ
డెవ్వఁడు ప్రహ్లాదవినుతుఁ డెవ్వఁడు పరముం
డెవ్వం డానందమయుం
డెవ్వఁడు గుణుఁ డీవుగాక హితకృద్రామా. 93

క. రామ రమారమణ యనుచు
నామది రంజిల్ల నీదు నామావళులన్
నేమఱకను నేతు నుతిని
నేమంబులు గూర్పవలదె శ్రీరఘురామా. 94

క. పరచింతలు లేకుండెడు
వరయోగులు నిన్ను నెపుడు వారనిభక్తిన్
పొరిఁబొరిఁ గొలువఁగ వారల
నిరతము రక్షింతుగాదె నృపమణిరామా. 95

క. సర్వాగమములు చదివియు
నుర్విని నిన్నెఱుఁగనట్టి యున్మత్తునకున్
నార్యుఁడని బిలువక గుణ
పర్యుం డండ్రె బుధవరులు పావనరామా. 96

క. విడువను మినుకులు చదువుట
విడువను నీభజనసల్పు విమలుల సేవల్
విడువను సత్కర్మచయము
విడువను నీపాదపూజ వినుమో రామా. 97

క. భూరిధనంబిడుమని కై
వారము నేఁజేయలేదు వారమునాకున్
వారని భక్తిన్నిడు మని
కూరిమితో నినుఁ గోరుచుంటి గురువరరామా. 98

క. హరియే ఘనుఁడని కొందఱు
హరుఁడే ఘనుఁడనుచుఁ గొంద ఱతివాదంబుల్
జరుపుదు రిల హరిరూపును
హరరూపము నీవగావ హరనుత రామా. 99

క. వాఁడే భక్తవరేణ్యుఁడు
వాఁడే కులపావనుండు వాఁడే గురుఁడౌ
వాఁడే బుధవంద్యుఁడు నె
వ్వాఁడు నిను మదిని దలఁచునొ వరగుణరామా. 100

క. గీతాశాస్త్రముఁ జదువుచుఁ
చేతోమోదంబున నిను సేవించుచు నీ
భూతలమున మెలఁగు నరునిఁ
గాతువు నీకరుణతోడ కవినుత రామా. 101

క. దండము దశరథనందన
దండము వేదండవరద దండము శౌరీ
దండము కుండలమండన
దండము కోదండపాణి దండము రామా. 102

క. వందనము కుందరదనా
వందన మమరేంద్రవంద్య వందనము హరీ
వందనము కబంధహనన
వందన మార్యనుత దీనబాంధవ రామా. 103

క. సూరిజననుతుఁడు ఘనసం
స్కారుఁడుఁ గాయస్థశిష్టకరణాన్వయుఁడా
గూరుకుల కంధివిధుఁడఘ
దూరుఁడు నీలగిరి తత్సుతుండను రామా. 104

క. ఈరామశతక మెప్పుడుఁ
బారాయణఁజేయునట్టి భద్రాత్ములకున్
గారామున మోక్ష మొసఁగి
భూరిశుభంబుల నొసఁగుము మురహర రామా. 105

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరామార్పణమస్తు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# జానకీపతిశతకము.

---

ఉ అయ్యయొ మాతృయావనమహావన ఘోరకుఠారుడం
చున, న్నయ్యలు బల్కనీదగు మహాత్వ మొకింతయుఁ జింత
సేయకన్, వొయ్యలులందు చిత్తమిడి దూరితధర్ముఁడనైన
నేను నా, దయ్యమ యెత్తికోలు తుదిఁదాకుట యెన్నఁడో
జానకీపతీ.

ఉ. చక్కని మేనువెన్నెలపస న్వొలిఁ బెట్టెఁడు నవ్వుచందురున్
హక్కుడిగించు మోముకఁడు నందపు సంపఁగిఁ గ్రిందొనర్చుబ
ల్మక్కుబుజాలనిక్కఁగ నిముమ్మరమా నెనరొందు టెన్నఁడో
పొక్కిట బమ్మదేవరను పుట్టొనరించిన జానకీపతీ. 2

---

శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము—1935.